# గీతావాణి

48



నాల్గవ సంవత్సరము  పండ్రెండవ సంచిక

గౌరవ సంపాదకులు: స్వామి శ్రీ శంకరానంద

## శ్రీ గీతాసాహిత్యసేవాసమితి,

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

15 జూన్ 1955.

# విషయసూచిక.



## గీతాప్రశస్తి.

“భగవద్గీతలను కొన్ని గంటలలోపలనే చదువవచ్చును. దానినర్థము చేసుకొనుటకు అనేక జన్మములు కావలయును. అర్జునునకు చెప్పినవి మాటలుకావు; జ్ఞానకళికలు. జీవితాదర్శ మంతయు నొక్కక్షణములో తెలుపబడెను. ఆకాశమును మెరుపుతీగ వెలిగించినట్లు ఆ జ్ఞానజ్యోతి అర్జునుని హృదయ ఫలకమును ప్రకాశింపజేసెను. అప్పు డర్జునుడు యుద్ధరంగమున దుమికెను; యుద్ధము చేసెను; శత్రువులను చంపెను; జయించెను. అయినను తాను యుద్ధముచేయలేదనియు తాను చంపినవాడు గాని, జయించిన వాడుగాని కాడనియు అనుభవములో గ్రహించెను.

— వివేకానందస్వామి.

# "గీతావాణి"

శ్రీ గీతాసాహిత్య సేవాసమితి పక్షమున ప్రకటింపబడు
గీతాతత్త్వ సందేశ మాసపత్రిక.



మేనేజింగ్ ఎడిటర్:

శ్రీ రామకృష్ణ

మేనేజరు:

స్వామి శ్రీశివానంద,

గీతావాణి — ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

సంవత్సరచందా 4—0—0 విడిపత్రిక 0—6—0.

15th JUNE 1955.

♦♦♦♦♦♦ కవిత ♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦

# శ్రీ భ గ వ ద్గీ తా సా ర ము

♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦ బాలకవి ఓ. నారాయణప్పగారు ♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦♦

## సప్తదశాధ్యాయము — శ్రద్ధాత్రయవిభాగయోగము



సీ॥ ఓం తత్ సత్తని యర్పి కర్మజ్ఞాన
 ములసల్పుదురు బుధుల్ మోదమొప్ప
దేవాళిగొల్తురు తెలియ సాత్వికశ్రద్ధ
 రాజసశ్రద్ధచే రాక్షసులను
తామస శ్రద్ధచేదగ ప్రేత భూతాల
 గొల్తురు కొందఱు కోర్కెదీర
నోరులకు త్రికరణాలొప్పమే లొనరింప
 త్రికరణ తపమని తెలియుమయ్య!

గీ॥ శ్రద్ధవిరహిత కర్మమసత్తెయగును
దానఫలమించుకయులేదు మానవునకు
అనుచు హరి పల్కెనరునితో నంచుదెలుపు
సకలజనమాత! శ్రీదాద!! సత్యగీత!!

---




సంపుటి 4 ★ స్వస్తిశ్రీ మన్మథ – జ్యేష్ఠమ్ ★ సంచిక 12

# గీతయొక్క దివ్యదీప్తి.

శ్రీమద్భగవద్గీత శ్రీకృష్ణభగవంతుని శ్రీముఖమునుండి జాలువాఱిన అమృతధార. ఇందు రసభరితములగు ఉపదేశములనేకములు గలవు. సర్వలోకహితార్థముగ గీతాచార్యుడు వేదములను మథించి అందలినిగ్గును సంక్షేపముగ నిందు నిరూపించినాడు. అలసులు - మందబుద్ధులు - అతిస్వల్పతరాయువులు - ఉగ్రరోగసంకలితులునైన కలియుగమానవులు ఆత్మశ్రేయమును గమనింపలేక పరమేశ్వరునిమఱచి తఱచు అధోగతి పాలగుదురనెడి యనుకంపతో, పరమకారుణికుడును - భక్తవత్సలుడును - భవసాగరతారకుడును నగు భగవంతుడు కృష్ణుడు, బహుజనహితాయ - బహుజనసుఖాయ, అర్జునుని నిమిత్తముగ చేసికొని కర్మ భక్తి జ్ఞానములకు

సంబంధించిన మహత్తరములగు ఆధ్యాత్మిక విషయముల నెన్నింటినో పూర్ణముగ గీతయందు విమర్శించియున్నాడు. అర్జునుని అజ్ఞాన జనిత వ్యామోహమును తుదముట్ట తుడిచివైచి, నిష్కామ కర్మాచరణ మూలకముగ తత్త్వజ్ఞానము నుపదేశించి కర్తవ్య కర్మయందు దీక్షాబద్ధునిగ నొనర్చినాడు.

విశ్వసాహిత్య వాఙ్మయమునందు గీతకు మహోన్నత గౌరవపీఠమున్నది. గీతపైగల గాఢశ్రద్ధ, పూజ్యభక్తి, గౌరవాతిశయములు జనసమూహమున మరొక్కశాస్త్రమునందు కన్పడుట లేదు. సమస్త సాహిత్యమును అల్పజ్ఞుడగు మానవుని రచనయే గదా! గీతయన్ననో సర్వజ్ఞుడును పురాణ పురుషోత్తముడును నగు శ్రీమన్నారాయణ దేవుని మధుర వాక్ప్రవాహము; ఉత్కట జ్ఞాన భండారము.

గీత అనేకములగు ఆధ్యాత్మిక రహస్యములను ప్రతిపాదించినది. అనేక జటిలప్రశ్నలకు సమంజసముగ - భావగర్భితముగ సమాధానమిచ్చినది. విషయమెంత దుర్బోధ్యమైనను సరలసుందర శైలియందు గీత స్పష్టమొనర్చినది. గీతను చదువుటకు అందలి తాత్పర్యమును గ్రహించుటకు పాండిత్యము హెచ్చుగ బనిలేదు. భాష సుబోధమును చిత్తమునకు హత్తుకొనునట్లును నున్నది. శ్రద్ధాభక్తులతో నిత్యమును పఠించువానికి క్రొంగ్రొత్త భావములు స్ఫురించుచుండును. కావుననే భగవద్గీత నిత్యనవీన గ్రంథమని ప్రాజ్ఞులు నుడువుదురు. సార్వదేశీయ సార్వ కాలీనములగు సిద్ధాంతము లిందడగియున్నవి. వారి వారి దృష్టికోణములకు తగిన భావమునె ప్రదర్శించుచు అదే మార్గమున వారికి సుఖశాంతుల ప్రసాదించును. ఇట్టి గ్రంథమును సర్వసమన్వయ శాస్త్రమని చెప్పుటలో అతిశయోక్తి ఆవంతయు లేదు.

గీత చెప్పినట్లు జీవితమును దిద్దితీర్చుకొని ప్రవర్తించువాడు అభ్యుదయ నిశ్శ్రేయసములను బొందుటలో సందియములేదు. భగవత్ప్రాప్తికి ఎన్నోసాధనములను గీతచెప్పినది. కర్మయోగము-భక్తియోగము – ధ్యానయోగము – జ్ఞానయోగము – అష్టాంగ యోగము, మొదలగునవన్ని యుభగవత్ప్రాప్తికి సాధనములేయని భగవద్గీతయొక్క ఉదాత్త సందేశము. వారి వారి ధర్మము కర్మము స్వభావము ప్రభావము శక్తి యుక్తి మతి స్థితినిబట్టి అర్హమగు మార్గమునవలంబించి భగవత్ప్రాప్తిని బడయనగును. ఏ మార్గమునైననేమి, భగవత్ప్రాప్తి కల్గించుటే గీతకుధ్యేయము. ఆ ధ్యేయమును శాస్త్రోక్తరీతి ననుసంధించుచు ఆచరించుచు మనుజుడు పరమపదము నధిగమించగలడు.

గీతయందు ప్రధానముగ చెప్పినవి రెండేమార్గములు. తక్కిన మార్గములన్నియు నీ రెంటియందె అంతర్గతములగుచున్నవి. ఒకటి సాంఖ్యమార్గము; రెండవది కర్మమార్గము – సాంఖ్యమార్గమనిన జ్ఞాననిష్ఠ. కర్మమార్గమనిన యోగనిష్ఠ. భక్తి యీ రెండింటియందును అనుస్యూతమైయున్నది. విచారదృష్టితో చూచినచో జ్ఞానయోగాచరణమునందు కర్మము బాధకముకాదు. కర్మాచరణమె ప్రధానముగాగల కర్మయోగమునందును కర్మ బాధకముకాదు. ఇంతకు బాధకమైనది కర్తృత్వ భోక్తృత్వ రూపమగు అభిమానమే. అందువలన కర్తృత్వ భోక్తృత్వరూపమగు అభిమానమును వర్జించి భగవత్ప్రీతి కొఱకై చేయబడెడి శాస్త్రవిహిత కర్మములు బంధకారకములుగావు. సకామ కర్మమునకు యెట్టి నిష్ఠయందును స్థానములేదు. కర్మలను తుదముట్ట వదలిపెట్టుటనునది యే విధమునను సాధ్యము కాదు.

మొదటిది సాంఖ్యనిష్ఠ. చరాచరాత్మకమగు జగత్తు ప్రకృతి కార్యమగుట వలన ప్రకృతియొక్క గుణములే సర్వత్ర ప్రవర్తించు చున్నవి. ఎండమావుల నీళ్లవలె, కలయందలి పదార్థములవలె మాయామయ ప్రపంచమున గుణములు గుణములందు ప్రవర్తించు చున్నవి. నేను కర్తనుకాదు; భోక్తనుకాదు. ద్రష్టను; సాక్షిని; కూటస్థుడను. ఇట్లు తన్ను తెలిసికొని దేహేంద్రియమనోబుద్ధుల యొక్క కర్మములయందు కర్తృత్వాభిమానమును వహింపక సచ్చిదానంద స్వరూపియగు పరమాత్మనందు ఏకత్వభావనతో నెలకొని అఖండ బ్రహ్మాకార నిష్ఠయందుండుట సాంఖ్యనిష్ఠ యందురు.

రెండవది యోగనిష్ఠ. గోచరించెడి యీ సంపూర్ణజగత్తునకు లోపల వెలుపల పరమాత్మ దొక్కడే అఖండముగ వ్యాపించి యున్నాడనితెలిసి, కర్మాసక్తియు కర్మఫలేచ్ఛయు మాని ద్వంద్వము లందు సమభావముగలవాడై భగవదాజ్ఞానుసారముగ యజ్ఞదాన తపస్సులనెడి సత్కర్మములను భగవదర్పణ బుద్ధితో జేయుచు త్రికరణ పూర్వకముగ భగవంతుని శరణుబొంది అతని నామగుణ ప్రభావలీలా చింతనమును నిరంతర మాచరించుట యోగనిష్ఠయని, లేదా కర్మయోగమని అందురు.

పూర్ణ శాస్త్రమగు గీత మానవునకు పూర్ణత్వసిద్ధికి వలయు మార్గములను చెప్పినది. సర్వతోముఖమగు దానిప్రకాశమున జీవితము నుజ్జ్వలమొనర్చుకొని మానవలోకము ధన్యమగుగాక !






(గత సంచిక 12-వ పుట తరువాయి)



పూర్వోక్త ప్రకారమున మహా పురుషుల నాశ్రయించి తత్త్వజ్ఞాన మును తెలిసికొనవలె ననెడి విధిని బోధించి, ఆ తత్త్వజ్ఞాన ఫలమును కూడ నిరూపించి ప్రకృతము దాని మాహాత్మ్యమును భగవంతుడు వర్ణించుచున్నాడు.

నాల్గవ అధ్యాయమున నిది ముప్పదియారవ శ్లోకము "అర్జునా! ఒకవేళ నీవు పాపులలో పరమపాపివై యున్ననుకూడ, జ్ఞానమనెడి నావ లభించినచో సమస్త పాపజలధిని తరించిపోయెదవు."

ఇచ్చట యీ శ్లోకమునందు 'అపి' అని 'చేత్' అని పదముల రెంటిని ప్రయోగించి, అసంభవి తార్థమును అంగీకరించినట్లు సూచిం పబడినది. అందలి స్వారస్యమేమనిన — భగవంతు డర్జునుని ఉద్దేశించి "అయ్యా! నీవు నిజమునకు పాపివి కాదు. దైవీసంపదయందు జన్మించిన వాడవు. నాకు ప్రియభక్తుడవు; వయస్యుడవు. పాప కళంకము లవ లేశము నిన్ను స్పృశించలేదు. అయి నను మాటవరుసకు అనుకొందము. నీవు పాపులలో కడగొట్టు పాపి వైనను ఈ తత్త్వజ్ఞాన మనెడి పడవ లభించినచో పాపసముద్రమునుండి అవలీలగ ఉత్తీర్ణుడవు కాగలవు అని నుడివియున్నాడు. ఈ మాటలవలన జ్ఞానముయొక్క అద్భుత మహా త్మ్యము వర్ణింపబడినది.

అంతఃకరణశుద్ధి లేనివారు జ్ఞాన మునకు అధికారులుకారని శాస్త్ర ములన్నియు ఏకకంఠమున చెప్పు చుండ పాపాత్మునకు జ్ఞానమనెడి నావలభించెడి అవకాశ మెక్కడిదో యని శంకింపవచ్చును.

ఈ శ్లోకమునందు 'చేత్' అని 'అపి' యని పద ప్రయోగముండుట

వలన అట్టి శంకకు అవకాశములేదు. పాపాత్మునకు జ్ఞానము లభింపదను మాట భగవంతునకుకూడ సమ్మతమే. వానికి జ్ఞానమనెడి నావలభింపజాలదు. ఒకానొక సమయమున భగవదనుగ్రహముచేతనో మహాపురుషుల ప్రసాదము వలననో మరి యేకారణము చేతనైననుగాని ఆ పాపికి జ్ఞానము లభించినచో వాడెంతెంతటి పాపియైనను తత్క్షణమె ఉద్ధారకము కాగలడు.

పాపరాశినుండి విముక్తుడైన పక్షమున పుణ్యబంధ ముండనె యున్నదిగదా! యని ప్రశ్నింపవచ్చును. పుణ్యకర్మములు సకామభావనతో చేసినచో బంధహేతువగుట నిజము. కర్మబంధముల నన్నింటినుండి విముక్తుడైన యప్పుడే సమస్త పాపములనుండి కూడ విడివడుట సంభవించుచున్నది. మరియొక విశేషమేమనిన — పుణ్యములను పరిత్యజించుటకు మనుష్యునకు స్వతంత్రమున్నది. వలయునపుడు మానవుడు వానిని స్వేచ్ఛగ విసర్జింపవచ్చును. కాని పాపఫలములను వదలుట మనుజుని స్వాధీనమునందు లేదు. జ్ఞానముననె వాటి బంధము తొలగవలసియున్నది. ఇన్నింటి బట్టి పాపజలరాశిని తరించుచున్నాడను మాటలో పుణ్యకర్మముల నుండి కూడ విడివడుచున్నాడను అర్థము యిమిడియె యున్నది.

జ్ఞానమనెడి నావవలన పాపసముద్రమును సులభముగ తరించగలడను మాటకు అర్థమేమి? నావయందు కూర్చున్న మనుష్యుడు అగాధ జలరాశిని సునాయాసముగ దాటునట్లు, జ్ఞానప్రాప్తివలన తాను నిత్యుడననియు, నిర్వికారుడననియు సంసారలీలలకు అసంగుడననియు అపరోక్షముగ అనుభూతిని పొందగలడు. ఆ అనుభూతివలన జన్మజన్మాంతరములందును, వర్తమాన జన్మమునందును, చేసిన సమస్త పాపసంచయమును అతిక్రమించగలడు. సమస్త కర్మబంధనముల నుండి అన్నివిధముల ముక్తుడగుటయె జ్ఞానమనెడి నావద్వారా పాపసముద్రమును దాటుట.

స్వరూపావరణమువలన కలిగిన భ్రమజ తాదాత్మ్యమే కర్మములకు ఆశ్రయము. "నేను అకర్తను — అభోక్తను — చిదానందఘనుడను - అక్రియబ్రహ్మస్వరూపుడ" ననెడి జ్ఞాననిష్ఠ యేర్పడినంతట ఆవరణభంగమును — భ్రమజతాదాత్మ్య నాశమును సిద్ధించగలదు. ఆ జ్ఞానమే నావవంటిది. తద్ద్వారా సిద్ధించెడి

సర్వకర్మ పరిహారమే పాపసముద్రమును దాటుట. సంసారసముద్రమును దాటుటకు అధిష్ఠాన బ్రహ్మజ్ఞానమే సమర్థమగు సాధనము.

అధికారి యగువాడు బ్రహ్మజ్ఞానమనెడి నావవలన పుణ్యపాపరూపమగు సముద్రమును దాటవచ్చునని ముందు చెప్పితిమి. సముద్రమును దాటిపోవచ్చును. కాని సముద్రమునకు అస్తిత్వము శాశ్వతముగ నుండిపోయెనుగదా! అట్లే పుణ్యపాపములకు సైతము అస్తిత్వముండిపోగలదా? అనెడి శంకకు సమాధానముగ ముందటి శ్లోకమున భగవంతుడు మరొక్క దృష్టాంతము నుదహరించుచున్నాడు.

"ఓ అర్జునా! ప్రచండముగ మండిపోయెడి దావాగ్ని అన్నిరకముల కట్టెలను భస్మీపటల మొనర్చునట్లు, జ్ఞానము పుణ్యపాపకర్మముల నన్నిటిని భస్మముచేయ గలదు."

నాల్గవ అధ్యాయము ముప్పది యేడవశ్లోకమున భగవంతుడీ మాట చెప్పియున్నాడు. "అహంబ్రహ్మాస్మి' జ్ఞానము ప్రజ్వలితాగ్ని వంటిది. ఆ అగ్నివలన పుణ్యపాప కర్మములను దాని కారణమగు అజ్ఞానమును నాశము కాగలదు. ఈ విషయము శ్రుతియందు సైతము —

"భిద్యతే హృదయగ్రంథి
శ్ఛిద్యంతే సర్వసంశయాః।
క్షీయంతే చాస్యకర్మాణి
తస్మిన్ దృష్టే పరావరే॥

బ్రహ్మాది దేవతలకంటె గూడ మహోత్కృష్టుడగు పరమాత్ముని తన ఆత్మస్వరూపముగ సాక్షాత్కారమును బొందిన మహనీయునకు హృదయగ్రంథి భేదనము సిద్ధించుచున్నది. ఆత్మానాత్మల అధ్యాసయె హృదయగ్రంథి యనబడును. వానియొక్క సంశయములన్నియు తుత్తుమురై పోవుచున్నవి. ఆత్మ దేహమునకంటె భిన్నమో, దేహాది స్వరూపమో, దేహాదికమునకంటె భిన్నమై యున్నచో బ్రహ్మస్వరూపమో బ్రహ్మమునకంటె భిన్నమో యనెడి సంశయములన్నియు విచ్చిపోవుచున్నవి. అతని సమస్తకర్మ సమూహమును నశించుచున్నది. ఈ విషయమును బ్రహ్మసూత్రము లందు, "తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్" అని చెప్పబడినది.

నేను బ్రహ్మనెడి బ్రహ్మాత్మానుభూతినిపొందిన మహానుభావుని యొక్క పూర్వకృతములగు సంచిత కర్మలన్నియు సమసిపోవుచున్నవి.

నీటియందున్న తామరపాకునకు నీరంటనట్లు ఆత్మజ్ఞానమును బొందిన పిదప చేసెడి కర్మముల బంధ మతనికిలేదు. — ఈ విషయ మనేకశ్రుతి స్మృతులయందు ప్రతిపాదింపబడినది.

ఈ జన్మమందును, గతజన్మములందును తాను చేసినట్టి సమస్తకర్మములును సంస్కారరూపమున మనుష్యుని అంతఃకరణమందు సన్నివేశమై యుండును. ఆ కర్మలయొక్క సూక్ష్మసంస్కార సమష్టినే సంచితమందురు. ఆసంచిత కర్మరాశినుండి వర్తమానజన్మమునందు ఫలోన్ముఖమగు కర్మను ప్రారబ్ధమందురు. ఈ జన్మమునందు వర్తమానశరీరముతో నొనర్చబడెడి కర్మము. 'క్రియమాణము' లేదా 'ఆగామి' యనబడును. వెనుక చెప్పినట్టి తత్త్వజ్ఞానము ఆవిర్భవించినంతట సమస్త పూర్వసంచిత సంస్కారములు నశించిపోగలవు. అంతట, ఆత్మస్వరూపము దేహేంద్రియ ప్రాణమనోబుద్ధులకు అతీతమును, అసంగమును అని తెలియుటవలన ప్రారబ్ధసంబంధమును దాని ననుభవించుటచే నంతఃకరణమున నేర్పడెడి సుఖదుఃఖ వికారములును సంభవింపనేరవు. ఈ కారణమున ప్రారబ్ధము సైతము నష్టమైనదియె యని చెప్పుదురు. ఇక క్రియమాణ కర్మమునందు జ్ఞానికి కర్తృత్వాభిమానము లేకపోవుటబట్టి అవి సంస్కారరూపమున పరిణమించజాలవు. అందుచే వాస్తవముగ నవి కర్మలేకావు.

తత్త్వజ్ఞాని సమస్త కర్మలనుండియు, వాటి ఫలములనుండియు, విముక్తుడు కాగలడని చెప్పి భగవంతుడు ముందటి శ్లోకమునందు తత్త్వజ్ఞానమును కొండాడుచు కాలక్రమమున చిత్తశుద్ధి కల్గినవానికి అయ్యది ప్రాప్తించుననియు చెప్పుచున్నాడు.

ఇమా।ఉ



# ★ గీతామృతాదేశము. ★

జల్లి శ్రీరఘుపతిరావు (విద్యార్థి), కోనేటిపురము.

"యజ్ఞశిష్టాశినస్సన్తో
ముచ్యన్తే సర్వకిల్బిషైః।
తేత్వఘం భుఞ్జతే పాపా యే
పచన్త్యాత్మ కారణాత్॥ (గీత 3_13)

శ్రీమద్భగవద్గీత ఒక అనన్త మహాపయోనిధి. అందు గంభీర తరంగములు కనిపించి, జడిపించినను, అగాధమున కేగిన సుప్రశాంతసుధా నిధానము లెన్నియో గన్పట్టును. అవి వివిధవిధజాతులకు, వర్గములకు, భిన్నప్రకృతులుగల మానవులకు అందరికి గమ్యస్థానములే; సుగమ్య నివాసములే;సుస్థిరరక్షణ సదనములే. అన్ని రకములవారిని సంతృప్తిపరచ గల విశేషమే, ఒక విధముగ గీత లోగల మహాత్మ్య మనదగును.

సమత్వ సాంఘిక సుఖజీవనము నకు గీతామృత ప్రబోధము నాధార ముగ దీసికొనవచ్చును. మానవుల మానసిక ప్రవృత్తుల ననుసరించి సంఘమున గల భేదములను బట్టి, ధర్మమును భగవద్భక్తి ద్వారా ప్రజలకు బోధించడమైనది. అవసర మును జూచి అందు పాపభీతినిగూడ మేళవించవలసి వచ్చినది. పైప్రవ చనమును పరికించిననిదే బోధపడును. సమాజమున ఉన్నవారు ఉన్న ట్లుగా ఆరగించుచు అనుభవించి, ఆనందించుటతో సరిగాదు; పౌరు గున అందందు ఆహారము కొఱకు "ఆహా!" రవములు జేయు అన్నా అందజేయుట అవసరము. అదియొక పుణ్యకార్య ముగనే గాక తమ విధియని దెలిసి జేయవలయును. ఈ సాంఘిక విధి నతిక్రమించుట పాపకారణమగునని పెద్దలు నుడివిరి.ఒరుల నోరకంటితో గూడ జూడక స్వప్రయోజనము కొఱకు, ఆత్మసుఖభోగము కొఱకు మాత్రమే జీవించువారు పాపాత్ము లని పెద్దలభావన. సంఘము నాధా రము జేసికొని సంపాదించిన సొత్తును స్వీయలాభమునకు మాత్ర ముపయోగించుట సంఘద్రోహము కాదా! అందుననే గీతాకారుడు "తే త్వఘం భుఞ్జతే పాపా యే పచ న్త్యాత్మ కారణాత్" _ తమకొరకే వండుకొనువారు పాపమును భుజించి నట్లే _ యని నిర్దుష్టముగ నుపదే శించెను. ఇట్టి శాంతియుత ధర్మ సూత్రమునకు మిన్నయైన సామ్య వాద సిద్ధాంత మెక్కడిది?

ధర్మమునకు సత్యమునకు ఎల్ల కాలములందు మూలతత్త్వమొకటి యైనను తన్నిర్వచనము లేక వ్యాఖ్యానము కాలానుగుణ్యముగ మారుచుండును. కనుక ధర్మవిరుద్ధముగాని అనువాదమును అపుడపుడు ఆదరించుటకూడ ఆవశ్యము. "యజ్ఞశిష్టాశినః"— యజ్ఞముజేసిన పిదప మిగిలిన (యన్నము) దానిని భుజించుట యని నుడివిరి. "యజ్ఞ" మన భగవత్ప్రీతికరమైన కర్మయని సామాన్య భావన. ప్రాక్తనకాలమున యజ్ఞము, ముఖ్యముగ మతకార్య కలాపములకు కట్టుబడియుండినను, ప్రస్తుతకాలమున 'యజ్ఞము' వివిధ రూపముల దాల్చినది. ద్రవ్యయజ్ఞము, తపోయజ్ఞము, సత్యాగ్రహ యజ్ఞము, సూత్రయజ్ఞము, భూదానయజ్ఞము సంపత్తిదానయజ్ఞము మొదలగునవి. ఇవన్నీ భగవత్ప్రీతికరమైన కర్మములే. వీనిలో నేదైన ఒక యజ్ఞమును విధిగ నొనర్చవలయునని గీతాదేశము. అపుడు మాత్రమే "యజ్ఞశిష్టా శినఃసన్తో"- పై జెప్పిన యజ్ఞములలో దేనినైన నాచరించిన తరువాత మిగిలినదానిని భుజించువారు "ముచ్యంతే సర్వ కిల్బిషైః" — సర్వపాపములనుండి విడువబడుచున్నారు. యజ్ఞము జేయుటచే వారికున్న కల్మషము, అఘము అంతరించగలవు. దాన స్వరూపమైన యీ పవిత్రయజ్ఞమునుజేసిన యనంతరమే మానవుడు పాపరహితుడును, సుఖస్వరూపుడు నగుట కవకాశము గలదు. గీతలో మరొక శ్లోకము. (4—31)కూడ ఈ ధార్మికకర్మ నేనియమించుచున్నది:—

"యజ్ఞశిష్టామృతభుజో
యాన్తి బ్రహ్మసనాతనమ్ ।
నాయం లోకో స్త్యయజ్ఞస్య
కుతో ఽన్యః కురుసత్తమ"

యజ్ఞము జేసినపిదప మిగిలిన దానిని భుజించువారు సనాతన బ్రహ్మమును పొందుదురు. యజ్ఞము జేయనివారికి, తదితరుల కీలోకమున స్థానములేదు.

సామ్యవాదము (Communism) సాంఘిక శాస్త్రము (Socialism)యుగ ధర్మముగ మారుచున్న అధునాతన కాలములో అవకతవ కలుగనున్న సంఘమును చక్కబెట్టుటకు కర్మకు గరిష్ఠప్రాధాన్య మీయవలసిన కాలములో భూదానయజ్ఞము, సంపత్తిదాన యజ్ఞము (లేక ద్రవ్యయజ్ఞము) ఆచరణీయములని విజ్ఞులకు, అనుభవజ్ఞులకు అవగాహన గాకపోదు. జ్ఞానయజ్ఞము మాత్రము నిరంతరం సాగుచుండవలసినదే. పై

నుదహరించిన యజ్ఞకర్మలు ప్రస్తుత భారతదేశమున కెంతేని యవసరము. లేనిచో దేశము దరిద్రుల పాలు కాగలదు. భిక్షాధికారి కడిపెడన్నము కొఱకు ఆశించుచుండ, లక్షాధికారి కోటీశ్వరుడు కావలెనని ఆ వేదన పడుచున్నాడు. తృప్తిపడక తమకు లేదని ఆకాంక్షించుచున్నంత వర కిద్దరును దరిద్రులే. కలవారింకను కూడబెట్టుకొనుట కశ్రాంతము యత్నించుచు శాంతిసౌఖ్యములకు గూడ దూరమగుచుండ, లేనివారు తమలేమికి దురదృష్టదేవతను నిందించుకొనుచు నిరుత్సాహులై, క్షుధార్తులై, కుమిలి, కృశించి నశించి పోవుచుండిరి. ధనికులని, దరిద్రులని, దేశీయులలో నిరుపక్షము లేర్పడినవి. ఇరువురిమధ్య నపారయగాధ మేర్పడినది. ఈ యపారక విభేద మడుకంటయంతరించనిదే దేశం పురోభివృద్ధిగాంచుటగాని, సుస్థిరశాంతి యందోలలాడుటగాని, "రామరాజ్యమ"గుటగాని దుర్లభము. అందుననే బుద్ధుని కాలమునుండి యీ ప్రబోధము జరుగుచునే యున్నది. "ప్రసాదో పరితలమున దాసీజన కల్పమాన తత్తదోర్ధ్వోల్లాసలసితాత్మలు దయాసార విధూరులౌ మహాంధులు తనయా" యని 'సౌందరనందమున' శుద్ధోదన నందనుడా నందునకు జేసిన బోధగానందగును. ధనభోగాదులతో తూగుచు నిర్దయాపరులగు వారిని మహనీయులు నిరసించుచునే వచ్చిరి. దరిద్రనారాయణుల సేవజేయుమని వివేకానందుడు తనజీవితాంతము శ్రోత్రగహ్వరము గింగురు మన వినుపించుచునే యుండెను. దీనులలో గల దేవుని కొఱకాయనెంతయో విలపించెను. కడుపు మలమల మాడుచుండు మానవునకు మతబోధజేయుట నిష్ప్రయోజనమని నుడివెను. ఇక గాంధీ ఋషి మాటలువినిన పేదలకు ఆర్థికమే ఆధ్యాత్మికము. ఆకటి కలమటించు ప్రజాకోటికి వేరువిధమగు బోధతెలియదు ... వారికి నీవు తిండిబెట్టుము. వారు నిన్ను తమ దేవునిగ భావింతురు ...ప్రతివారును తమకు వలయుదానినే తమతో నిలుపుకొనిన ఎవ్వనికిని లేమి యుండదు. దృఢకాయముగల పురుషుడు గాని, స్త్రీగాని, పనిదొరకక లేక తిండిదొరకక కుందుచుండు నంత కాలమును, దండిగ తిండితినుటయు నిర్విచారముగ జీవించుటయు మనకు లజ్జాకరము." కనుక నాకలిగొన్న వానికి కడిపెడన్నమిడి, సంతృప్తి

పఠించి తదనంతర మాధ్యాత్మము నుగ్గుబోయవచ్చును. అదియే మహా యజ్ఞము, నిష్కామసేవ, మానవ సేవ — మాధవసేవ. పరమేశ్వరుని పరాయణత్వము పామరులలో గాంచవలయును. భగవంతుని మహాత్వమును బీదలలో చూడవలయును. ఇది ఆధునిక సిద్ధాంతము, అధునాతన ఆధర్మము.

నైతికదృష్టితో గాంచదగు సత్యమది. సామాజికదృష్టితో చూచిన నిదే సత్యము బోధపడగలదు. పరస్పర సహకారముకొఱకే గదా పదిమందిగూడి సంఘముగ నేర్పడినది! సంఘములో లేక దేశములో గల సమస్త సంపత్తియును సంఘస్థులందరికి లేక దేశీయులందరికి జెందవలయుననుటనిర్వివాదాంశము. సంఘజీవిగ మాత్రముండి సంఘీభావము లేనంతవరకు సంఘస్థుల సహకారము పొందనంతవరకు నొకవ్యక్తి యేవిధముగను ముందంజవేయలేడు. ఒకవ్యక్తి పరులకంటె నధికాస్థిమంతుడై లేకధనవంతుడై నాడంటే యది తదితరుల సహాయ్యము వలననే. అందుచేనది సర్వులకు సంబంధించిన సొత్తు. అందరకు అధికారముగల ఆస్థిని కొందరు వ్యక్తులుమాత్రమే ఆక్రమించుకొని అనుభవించుట 'అఘము'ను భుజించినట్లే యని గీతాబోధకుని నిర్ణయము. మానవులలో వారివారి గుణముల ననుసరించి ఆర్థిక; ఆధ్యాత్మిక సమత్వ మవసరమని కూడ వారి యుద్దేశము. ఇట్టి నిగూఢభావ పరంపరలెన్నియో గీతాశ్లోకములయందు ఘనీభవించి యున్నవి. ఆధ్యాత్మిక చైతన్య ప్రకోపమునకే గాక, స్వాతంత్ర్య, సమానత్వ, సౌభ్రాతృత్వ సాంఘిక సిద్ధాంతముల నుద్దేశింపజేయుటకు గూడ నవి దోహదకారులు.

ఈ గీతాప్రవచనము కలిమిలేములున్నపుడే, ఇచ్చువారు పుచ్చుకొనువారున్నపుడే—ప్రజలలో భేదమున్నపుడే నుపకరించును గాని సమానత్వము చేకూరినపిదప నిరుపయోగమని శంక పొడసూపవచ్చును. ఎంతటిసు స్థిర ప్రజారాజ్య మేర్పడినను, ఎంతటి ప్రబలసామ్యవాద సిద్ధాంతము వ్యాపించినను ఎంతటుత్కృష్టసాంఘికవాదమువర్ధిల్లినను ప్రజలలో సంపూర్ణ సమానత్వము(Absolute equality) సిద్ధించుట అసాధ్యము. కొద్ది పరిమితిలోనైనను హెచ్చుతగ్గులుండక తప్పవు. ఇద్దరి మానసిక శక్తులెపుడు నొకటిగ నుండవుగదా! కనుక దేనినైనను ఉన్నవారు లేనివారికిచ్చుట

(మిగత 20-వ పుటలో)

# స్థితప్రజ్ఞదర్శనము

[ 1953 మార్చి సంచిక 28-వ పుట తరువాయి. ]

## ఆరో ప్రసంగము.

### 55. ఈశ్వరభక్తి ఈశ్వరభక్తికోసమే ప్రవర్తించాలి.

ఇంద్రియ నిరోధం పూర్తిగా సిద్ధించాలంటే ఈశ్వరభక్తిని సహాయంగా తీసుకోవాలని యింతకు ముందు చెప్పివున్నాం. కాని ఆమాట అంతటి సమగ్రం కాదు. ఎందుకంటే — ఈశ్వరభక్తి దేనికీ ఒక సాధనమాత్రం గాక అదే స్వయంగా స్వయం భూసాధ్యమై వుండాలి. ఈశ్వరభక్తికి ఏదో ఒక అవాంతర ఉద్దేశ్యం అంటూ వుండ రాదు. ఈశ్వరభక్తి యీశ్వరభక్తి కోసమయ్యే ప్రవర్తించాలి. కళకోసం కళ, విద్యకోసం విద్య, జ్ఞానం కోసం జ్ఞానం - అనేమాటలను యీ రోజులలో మనం వింటూ న్నాం. కాని అవి సత్యమైన మాటలు కావు. సాంఖ్యులు యీ తీర్మానాన్ని ఎన్నడో చేసేవున్నారు. జడవస్తువులు వున్నాయంటే అవి స్వోపయోగంకోసం కాదు. ప్రకృతి ప్రకృతికోసం కాదు - పురుషునికోసం. కళ ఆత్మకోసం. విద్య నాకోసం. జ్ఞానం నా కోసం. జడవస్తువు జడవస్తువుకోసమే యనెడి భాషే తప్పు. కాని యీశ్వరభక్తి విష యంలో యీ భాష సరియే. ఎందుకనగా - ఈశ్వరుడు జడవస్తువు కాదు; బాహ్యవస్తువు కాదు. ఆయన నాయొక్క పరిశుద్ధ స్వరూపం. అందువల్ల యీశ్వరభక్తి ధ్యేయమై వుండాలి. తక్కిన కోర్కెలును సాధనాలును దానికొరకై ప్రవర్తించాలి.

### 56. భక్తుని భూమిక ప్రకృతి వైద్యుని లాంటిది.

రోగం వచ్చింది. దాన్ని పోగొట్టేకోసము ప్రయత్నాలు జరుగుతవి. రోగాన్ని యెందుకు పోగొట్టాలి. రోగాన్ని దూరంచేయుట మన ధ్యేయం కాదు. మన ధ్యేయం ఆత్మ కల్యాణాన్ని సాధించుట. ఆత్మకల్యాణం కొఱకు రోగాన్ని దూరీకరించుటే ఆవశ్యకమైతే అట్లే చేయొచ్చు. ఒకతూరి ఒకానొక శాస్త్రజ్ఞునితో సంభాషణ జరిగి నది. అతడు ప్రకృతి చికిత్సను సమర్థించేవాడు. "మీ శాస్త్ర ప్రకారం రోగులనందరిని బాగు చేయవచ్చా?" అని ఆయనను అడిగాను. "కాదు. రోగుల నందరిని బాగు చేయ వీల్లేదు. రోగాల నన్నిటిని బాగుపరచవచ్చు" - అని అతడన్నాడు. నిజమైనమాట. అతని పద్ధతిలో చావదగిన రోగులు చస్తారు. కాని శాంతి పూర్వకంగా చస్తారు.

బాగయ్యేవారు బాగవుతారు. వారూ శాంతి పూర్వకంగా బాగవుతారు. ఇదే పద్ధతి మన యీ ప్రసంగంలో కూడా అతుకుతుంది. "ఈశ్వరుని అభిప్రాయంలో నా ఆత్మోన్నతికి రోగాన్ని దూరం చేయుటే యిష్టమైతే అట్లే అవుగాక; రోగము వుండవలసినదే అభీష్టమైతే అలాగే జరుగుగాక ! ఆయన యిష్టమేదో అదే నెరవేరుగాక !" అని భక్తుడంటాడు. భక్తుడు అవాంతర నిర్ణయాలన్నింటియొక్క భారాన్ని పరమాత్మునిపై వదలి తాను నిశ్చింతుడౌతాడు. వాని బుద్ధి ఒక నిర్ణయానికి వచ్చిచేరింది. "నాకు ఆత్మోన్నతి కావాలి; కాబట్టి యీశ్వరభక్తి అవశ్యం కావాలి." – ఇంతే దానికి తెలిసినది. తక్కింది వాడెరుగడు. వాడు చేసే బహిరంగ కర్మ కలాపమంతా ఆ యీశ్వరభక్తిని పొందే కోసమయ్యే ప్రవర్తిస్తుంది. ఏ బాహ్యకార్యాన్ని సాధించే కొరకైనా కూడా యీశ్వరభక్తిని వాడు సాధనంగా వుపయోగించడు. దాన్ని దురుపయోగం చేసే పద్ధతి వానికుండదు.

## 57. అనన్యభక్తి సకామబుద్ధినుండి కాపాడుతుంది.

"గౌణరూపంతో కానీగాక; అనన్యత్వము పొందగోరే నియమంలో కానీగాక భగవద్గీత సకామభక్తికి ఆస్పద మెందుకివ్వాలి?" అనే ప్రశ్న యీ చోట ఉదయించొచ్చు. దీనికి సమాధానం వుంది. తనకోర్కెలు నెరవేరేకోసం కానీగాక, తక్కిన అల్లరి చిల్లరి ఆధారాల నన్నిటినవదలి, అనన్యభావంతో పరమాధారమైన భగవంతున్ని శరణుబొందాడు. కాబట్టి వాని ప్రవర్తన – వాని నిశ్చయం సామాన్యమైంది కాదు. సకామత్వమనేది తక్కువదే యగుగాక; కాని బంగారువంటివాని నమ్మిక వానికి ఆత్మోన్నతిని సాధించి తీర్తుంది. ఈ అభిప్రాయం ఏడో అధ్యాయంలో సూచింపబడింది. ఆ తర్వాత తొమ్మిదో అధ్యాయంలో మరొక్క అడుగు ముందుకు పోయి "చెడ్డ దురాచారియైనా సరే, నన్ను అనన్యభావంతో భజిస్తే శీఘ్రమే వానిభావన పరిశుద్ధమౌతుంది" అని చెప్పబడింది. "క్షిప్రం భవతి ధర్మాత్మా", వాడు శీఘ్రమే ధర్మాత్ముడగును. ఇది అనన్యత్వముయొక్క మహిమ. రోగం వచ్చింది. అది నయం కావాలి. భారమంతా భగవంతునిపై వేశాడు. డాక్టరుతో గిక్టరుతో పనిలేదు. తిండి తీర్థాలే వదిలాడు. "భగవంతా ! నన్ను కాపాడు" – ఇదే అనన్యభక్తుని ఆర్తనాదం. వాని శ్రద్ధను చూచి భగవంతుడు బాగుచేయవచ్చు; లేదా ప్రత్యక్ష దర్శనమిచ్చి తన దగ్గరికి చేర్చుకోవచ్చు. అట్టియెడ వానికోర్కె నెరవేరలేదని లోకులు భావించినా, భక్తుని అనుభవంలో వానికి అత్యంత కల్యాణమే చేకూరింది.

## 58. కుచేలుని దృష్టాంతం.

ఈ సందర్భంలో కుచేలుని కథ ఉత్తమమైన ఉదాహరణం. భరింపరాని దరిద్ర బాధకు ఓర్వలేక భార్య అతన్ని శ్రీకృష్ణునివద్దకు పంపింది. శ్రీకృష్ణుడు ఏమీ యివ్వక

ఆయన్ను వూరక వెనుక్కు పంపాడు సాగనంపుతూ చాలాదూరం ఆతని వెనువెంటే వచ్చాడు. తాను తెచ్చిన పిడికెడు అటుకులు సైతం ధారపోసి వట్టిచేతులతో కుచేలుడు యింటికి పోతూన్నాడు. కాని ఆయన మనస్సులో ఒకటే ఆనందం. భార్య పోరుపడలేక తాను భగవంతుని దగ్గరకు కోర్కెలు అడిగేకోసం వచ్చాడు. ఔరా! భగవంతు డెంత దయామయుడు. కోర్కెలుకోరే అవకాశమే యీకుండా భక్తుని వూరకనే సాగనంపుతూన్నాడు. అంతే పదివేలు. కుచేలుడు తనలోతాను తలపోస్తూ భక్తిని దృఢపరచుకొంటూ చక్కా వూరికి పోయాడు. కథ చెబుతుంది – అతడు గ్రామంచేరి చూచేసరికి మొత్తం తన వూరంతా బంగారే బంగారు. "భగవంతుని యెంత దయోదాసులమై. ఇంత యైశ్వర్యం తుచ్ఛమైన నా సుఖ భోగాల కొరకేనా? మాధవుడిచ్చిన యీ సంపదను మానవ సేవలో వినియోగిస్తాను." భగవంతుడిచ్చినా ఆయన దయే. ఇవ్వకున్నా ఆయన దయే. ఈ అనన్యతా భావంలోనే భక్తుని గొప్ప ధనం యిమిడివుంది.

## 59. దేన్నికూడా భగవత్కృపగానే భక్తుడు భావిస్తాడు.

ఏకనాథునికి అనుకూలవతియైన భార్య దొరికింది. "పాండురంగా! నాపై నీ దయ అపారం. సుగుణరాశియైన భార్యను దయచేసి నీ భక్తి చేసేటందుకు యింతింతన రాని సహాయాన్ని కల్గించావు." అని సంతోషించేవాడు. తుకారాముని పరిస్థితి దీనికి నేరుగా విరుద్ధం. అతని భార్య గంపగయ్యాళి. "విఠలనాథా! నీ దయేదయ, సంసారంపై విరక్తి కల్గేలాగా తగిన భార్యను దయచేశావు. ప్రభూ! నీమేలు మరువలేను," అని ఆయన భావించేవాడు. ఏది జరిగినా భగవదనుగ్రహమే. ఒక భక్తునికి భార్య మరణించింది. ఆతడంటాడు. "భార్య గతించింది. నాకు మాయాబంధము తెగింది. విఠోబా! యిక మన యిద్దరిదే రాజ్యం. నీకూ నాకూ మధ్య తెరవుండింది. అది తొలగింది. ఇక మన ఏకచ్ఛత్రాధిపత్యానికి అడ్డమే లేదు." అనన్యభక్తుని భూమికలోని మహిమ యిది.

## 60. అనన్యభక్తుని సకామత వ్యాపకమైనసద్భావన; దానికొక లౌకిక దృష్టాంతము.

కోరికలకోసం యీశ్వరునియెడ అనన్యభక్తి కల్గియుండుట తక్కువ రకంగా వుండొచ్చు, లేదా తక్కువగా కనబడవచ్చు. కాని వాని అనన్యత్వ మూలమున భగవత్కృప కల్గి చిత్తశుద్ధి సంభవింపగలదు. అనగా వాని సకామత్వము నశించి నిష్కామత్వము లభించగలదు. ఈ మాటను మరింత స్పష్టముగా చెప్పవలెనంటే – సకామభావన నిష్కామ భావనగా మారిపోగలదు. ఇంతెందుకు? అనన్యభక్తితోగూడిన సకామత్వమును లోతుగ విచారించినచో – అది సంకుచితమైన సకామత్వము గాక విశాలమూ వ్యాపకమూనైన సద్భావనగా గోచరింపకపోదు. దీనికి పెద్ద ఉదాహరణలను మాని చిన్న లౌకిక ఉదాహరణాన్నే గ్రహిస్తాము. అనుకొండి. ఒక స్త్రీకి భగవంతునిపై అనన్యభక్తివుంది. ఆమె

ఒకనాడు తన నత్తు (ముక్కెర) పోగొట్టుకొంది. అది దొరకాలని ఆమె యిష్టం. "భగవంతా! నా నత్తు దొరికించు. నీ భక్తిలో నేనెట్టిలోపం చేయలేదుగదా? మరి – నా సొమ్ము ఎందుకు పోవాలి? దాన్ని కాజేయాలనే బుద్ధి యెవరికో ఎందుకు పుట్టాలి? దాన్ని వెదికే ప్రయత్నం కూడా నాకు లేదు: పోలీసు రిపోర్టుకూడా చేయను. ఎవని పైనా కూడా నాకు సందేహం లేదు. తీసుకొన్నవాని హృదయంలో నీవు సద్బుద్ధిని కల్గించావంటే వాడేవచ్చి యిచ్చిపోతాడు. అప్పట్లో నీకు పణ్యారం పంచుతాను. అపహరించినవానికి సగం పణ్యారం పెడ్తాను. వానిని యీసడించుకోను. నీయందు మరింతా భక్తి చేస్తాను. నీవు వానికి అట్టి సద్బుద్ధి నివ్వకపోతే వానిపై నాకు కోపం లేదు. నీపైన్నే నాకు కోపం. ఆ ఆవేశంతో మరింతా తీవ్రమైన భక్తిభావాన్ని నీపై గ్రుమ్మరిస్తాను. పో! నీవింక చెయ్యవలసిందేమో చేయు"మని ఆమె అంటుంది. అనన్యభక్తి – సకామత్వములు రెండూ కలిసిన స్వరూపం యింత గంభీరంగా వుంటుంది. కథలో చెప్పిన స్త్రీయొక్క కోర్కెలోని అంతర్యం ఏమి? ఒకని వస్తువును మరొక్కడు అపహరించుట వుండరాదనీ, ప్రపంచంలోని ప్రతివాని చిత్తవాసనలూ పరిశుద్ధం కావాలనీ ఆమె కోరికలో దూరంగా అగపడే సూక్ష్మార్థం కాదా? భగవంతుడు తన నా సాభరణాన్ని తనకు రప్పించనీ రప్పించకపోనీ, ఆయన యిష్టం పైన్నే తాను నడచుట నిశ్చితమైన మాట. ఆయన తన నియమానికి అనుకూలమేదో అదే చేయుగాక! అయితే ఆయన నియమం యిదేనంటూ నిష్కర్షగా మనకు తెలియదుగదా! తెలిసేవుంటే మనమే ఆ పీఠాన్ని ఎక్కివుందుము. మనకు భగవంతునితో పనే లేక వుండేది. ఆయన శాసనం ఏదైనా అయివుండొచ్చు. ఆ స్త్రీ ఉభయ పక్షాలలో భక్తి చేయవలసివచ్చింది. అనన్యభక్తి – సకామత్వములు రెండూ కలిసినపుడు యేర్పడే ఫలిత మేమిటో యీ ఉదాహరణం స్పష్టం చేసింది.

## 61. ఈశ్వర పరాయణత్వమే ముఖ్యము; వాసనలను యీశ్వరపర మొనర్చు.

ఇంతవరకు తేలిన సారాంశ మేమంటే — అవాంతర కామనల మాటెందుకు – చివరికి యింద్రియ నిగ్రహమనే సాధనకూడా గౌణమైందే. ఈశ్వరపరాయణతే అసలు వస్తువు. అదే ముఖ్యం. "నీవు నన్నే ఆశ్రయించు. మత్పరాయణుడవు కా. ఉవ్విళ్ళూర్చుకొంటూ విషయాలయెడ దీనుడవు కావొద్దు. ఇంతమట్టుకు నిలు. నీ సమస్త వాసనలు వూడ్చుకొనిపోతాయి" – అని భగవద్గీత కొద్దిలో ఘాటైన మాట చెప్పింది. చిత్తంలో వాసనలు చెలరేగుతూండొచ్చు. కానీ వాటికి నీనుండి బహిరంగ సహాకారం లభించకుంటే చాలు. వాసనలకు అనుకూలంగా బాహ్యంలో కార్యాలు జరిగినపుడు వాటికి పుష్టి లభిస్తుంది. కాబట్టి – ఆ పని మాత్రం జరుగనీరాదు. మరో విషయమేమంటే

బాహ్యేంద్రియాలను యెంతగా నిగ్రహించినా సాధకుని చిత్తంలోని వాసనలు సమసి పోక పోవచ్చు. వాటివల్ల జరిగే 'మనసులో గ్రుద్దులాట'తో సాధకుడు విహ్వలుడు కావొచ్చు. వాడేమి చేయాలి? వాసనలను యీశ్వరపరం చేయాలి. "భగవంతా! నా చిత్తంలో కలిగే వాసనలుకూడా నీవే అయిపో" అని ఏకనాథుడు ప్రార్థించేవాడు. ఈ విధంగా వాసనలన్నీ రూపుమాసి పోగలవు. ఈశ్వరమయం కాగలవు. భక్తివలన ఉన్నత స్థాయిని చెందగలవు.

## 62 వాసనలు స్వయంగా చెడ్డవి కావు; ఈశ్వరపరాయణతతో అవి మారి పోతవి.

వాస్తవంగా యేమనుష్యునిలోకూడా చెడ్డవాసనలంటూ లేవు. కానీ యీ విష యం వానికీ తెలియదు; యితరులకూ తెలియదు. బాహ్యవస్తువుకోసం వాడు ప్రాకు లాడ్తాడు. ఈ సృష్టి అంతా తనదిగానే వుండాలని వాని ఆశ. అప్పుడప్పుడు నిషిద్ధ వస్తువుకోసం ప్రయత్నించినట్లుకూడా వుంటుంది. నిజమేమంటే – శరీరమనే కారా గారంలో బద్ధమైయుండే ఆత్మ, వ్యాపకత్వాన్ని పొందాలనే ఆకాంక్షతో చేసేప్రయ త్నమే అది. ఈ విరాడ్విశ్వముతో ఏకరూపత చెందాలని వాని యిచ్ఛ. శరీర పంజ రంలో అడగి మడగి వుండడంలో వానికి సుఖం లేదు. త్రాగుబోతు మద్యాన్ని త్రాగు తాడు. దానికి మూలంకూడా యీ ఆవేదనే. "ఈ క్షుద్రమైన మద్యాన్ని వదలిపెట్టు. భగవద్భక్తియనే మద్యాన్ని త్రాగు"మని భక్తిమార్గం వానికి బోధిస్తుంది. ఉమర్ ఖయ్యాం వ్రాసిన కవిత్వంలో యిదే భావం వ్యక్తమౌతుంది. "వాసో యథా పరికృతం మదిరా మదాంధః" – భక్తియనే సురాపాత్రతో యీ భూమిక సిద్ధిస్తుంది. ఈవిధంగా భగవదర్పితమైన వాసన దివ్యరూపాన్ని ధరిస్తుంది. అందుకే 'మత్పరాయణుడవు'కమ్మని భగవంతు డాదేశించినాడు. చిత్తంలో విషయ వాసనలు పుట్టగనే గాభరా పడొద్దు విషయభోగాలలోకి మాత్రం జారిపోవాకు. వాసనలను భగవంతునికి సమర్పించు. కామ క్రోధాదులనుకూడ వానికే నివేదించు. దీంతో నీ వాసనలు రూపాంతరం చెందుతవి. అప్పట్లో చిత్తంలోని వికారాలు శమించి ప్రజ్ఞ స్థిరమౌతుంది.

## 63. నిష్కామము, అనన్యతా, ఈశ్వరభావనా – వుంటే భౌతిక విద్యోపాసనలు సైతం పావనం కాగలవు.

భౌతిక విద్యను ఉపాసించుటలో నిష్కామతా – అనన్యతా – ఈశ్వరభావన కలిసివస్తే ఆ ఉపాసనవల్ల చిత్తశుద్ధి సిద్ధిస్తుంది. ఈ దృష్టిలో భౌతికమూ ఆధ్యాత్మికమూ అనే భేదమే వుండదు. అసలు – యీ భేదం వాస్తవంకూడ కాదు. అప్పట్లో గణితో పాసకుని దేవుడు గణితమే అయితే వాడాభావనను పొంది సాధన చేయాలి. ఇక గణిత

శాస్త్రజ్ఞుని విషయం చెప్పుటకద్దు. ఆతడొక అపూర్వమైన పరిశోధన చేశాడు. ప్రపంచాన్ని చకితం చేసే ఆ పరిశోధనను వాడొక కాగితంపై వ్రాసి పెట్టాడు. ఒక సమయంలో వాడు వ్రాసిన కాగితాలన్నీ నష్టమైపోయాయి. ఆ శాస్త్రజ్ఞుడు ప్రశాంతంగానే వున్నాడు. వాని చిత్తంలో క్షోభ కల్గలేదు. కేవలం గణిత విద్యాంసుడే అయితే యిట్టి శాంతి వానికి వుండబోదు. బహుశా వాడు చేసే గణిత విద్యోపాసన యీశ్వరార్పణ బుద్ధితో చేస్తూండొచ్చునని మనం భావించవలసి వుంది. ఈశ్వరుడనే పేరే వాడు వినివుండక పోవచ్చు. కానీ వాని ఉపాసనలో అంతర మేమీరాదు. నావంటివాడు రాట్నం వడుకుటలో తన్మయం కావొచ్చు. మరొకడు మరొక పవిత్రమైన సామాజిక ఉద్యమంలో తన్మయమై వుండొచ్చు. ఆయా విషయాలను యీశ్వర స్వరూపంగా భావించి యెవడు ఉపాసన చేస్తాడో, వాని చిత్తంపై యింద్రియాలు దాడిచేయలేవు. కేవలం భౌతిక దృష్టితో చేసే సాధనలకు యిట్టి సిద్ధి లభించే వీలుండదు. కారణం స్పష్టం. భౌతిక విషయాలు చివరికి ఆత్మనుండి దూరమై - ప్రత్యేకమై వుంటవి. ఆత్మ భిన్నాలైన అనాత్మ విషయాలలో లీనం కావాలని యెంత ప్రయత్నించినా ఆత్మకు సఫలత చిక్కదు. ఆ విషయమే యీశ్వరభావనా భావితమైనచో అందులో ఆత్మ లీనమయ్యేటందుకు యెట్టి ప్రయాస వుండబోదు. వానిలో అది పూర్ణ విసర్జనం పొందగల్గుతుంది.

(14 వ పుట శేషము)

తప్పదు. ఆర్థికముగ గాకున్నను ఆధ్యాత్మిక మానసిక, విద్యా, వైజ్ఞానిక ప్రాణదానములు నిరంతరము జరుగుచు నుండవలయును. అపుడును ఈ యజ్ఞదీక్షవహించక తప్పదు. యజ్ఞార్థము రూపాంతర మొందినను మూలతత్వము మాత్రము మారదు. ఏ యుగమునైనను యజ్ఞకర్మతో నవినాభావ సంబంధ మేర్పరచు కొనుటవసరము. గీతామృతాదేశ మేనాటికి నిరుపయోగము కాదు. అది సర్వులకు సమస్త పరిస్థితులలో నుత్కృష్టస్థితిగతులను గల్పించు యోగ్యవస్తువు "గీతా కల్పతరుం."

# మోక్షయానము.

సింహాద్రి శత్రుఘ్నులు శ్రేష్ఠి.
హీరమండలం — శ్రీకాకుళం జిల్లా.

గీత మొత్తము యేడువందల శ్లోకములలో శ్రీకృష్ణపరమాత్మని ముఖారవిందము నుండి వెలువడిన 574 శ్లోకములూ విశేష ప్రతీతి కలవే. గీతయందలి ప్రతిశ్లోకమూ మోక్షయానమే; అంటే భవసాగరమును దాటించి పరమపదమును జేర్చు సాధనమన్నమాట. అందుకనే:—

శ్లో॥ సంసారసాగరం ఘోరం తర్తు మిచ్ఛతి యో నరః।
గీతా నావం సమాసాద్య పారం యాతి సుఖేన సః ॥

ఘోర దుఃఖముల కాధారమగు సంసారసాగరమును దాట గోరు నరుడు గీతయను నావ నధిష్ఠించిన సుఖముగా దాటగలడు, అని చెప్పబడినది. సాగరము పారము తెలియక, సదా కల్లోలములతో కూడుకొని, మొసలి మొదలగు ననేక క్రూర జలచరముల కాలవాలమై, బహు సుడులు గలిగి యుండునది. అట్టి సాగరమును దాటుట కెట్టుల యోడ కావలెనో; అనేక జననమరణవ్యాధులను ఘోరదుఃఖభాజనమై, సంకల్పములను కెరటములు గలిగి, రాగద్వేష కామక్రోధాది దుష్టజంతువులకు స్థానమై, సంశయములను సుడులతో గూడియుండు యీ సంసారసాగరమును సునాయాసముగా దాటుటకు భగవద్గీతా పఠనము, దానియందు చెప్పినట్లాచరించు టత్యవసరము. ఈ పవిత్రమార్గమున ప్రయాణ మొనర్చువారు మధ్యమధ్య చెలరేగు తుపానులకు తూలక, మార్గావరోధమునకు కలవరపడక, నావనుండి జారిపోకుండ జాగ్రత్తగా చూచుకొను చుండవలెను.

శ్లో॥ శనైశ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా।
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్ ॥ (6-25)
యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరం।
తత స్తతో నియ మ్యైత దాత్మ న్యేవ వశం నయేత్ ॥ (6-26)

ఆత్మేతరమగు యితర విషయము కొంచమైనను దలంచక బుద్ధి చేత ధైర్యమవలంబించి, మెల్లమెల్లగా మనస్సును తనయాత్మయందు లయపరచి, ఆత్మోన్నతిని పొందించవలయును. నిలుకడలేక చపలమగు మనస్సు యేయే విషయములందు సంచరించునో, యీ మనస్సు నాయా విషయమునుండి మరలించి తనస్వరూపమందే నిలుకడ పొందించవలయును. ఆత్మనిష్ఠుడగు సాధకుడు ప్రప్రథమమున తీవ్రముగా నభ్యసించక, (City motor driver) లాగు,ఎవెరెష్టు శిఖరారోహణ మొందిన టెన్సింగు లాగు నింపాదిగా జాగ్రత్తగా నాచరించవలెను. అట్లుగాక; ప్రకాశ మెక్కువ కోరి లైటువత్తి నెక్కువగా యెత్తిన మొదటి వెలుతురు లేక పోవుటయేగాక పొగపట్టి చిమ్నీ పగిలిపోవునట్లు యీయాత్మనిష్ఠుడు కూడ పతితుడు కాగలడు. "యుక్తాభ్యాసేన యోగేన సర్వసిద్ధి సముద్భవః" పరిమితి ప్రమాణముగా శీలించెడు సాధన వలన యోగము సిద్ధించును. మట్టితో కట్టెడు గోడవలె కొంచెము కొంచెముగా నిష్ఠసలుపుతూ వాడు దుడుకులు లేకన్నా చూచుకొని క్రమక్రమముగా వృద్ధి పొందించవలయును.

వాంఛితము లెంతగా ఫలించుచున్నను తృప్తికలుగజేయక జ్ఞానికి కూడ కోపము, మతిభ్రమ కలుగజేసి భ్రష్టుని చేయుచున్నవి. ఏయే కోరికలకు మనస్సు పరుగిడునో, వాటి సుఖదుఃఖములు నస్థిరత్వము తెలుసుకొని, అట్టి కోరికలనుండి మనస్సు మళ్లించుకొని ప్రశాంత మొందవలెను. కామనా త్యాగమే కామధేనువు, కల్పవృక్షమూను. పెరడులో కల్పవృక్షమున్న వారికి యితర వృక్షములతోగాని, యితర వృక్షఫలముతో గాని పనిలేదు గదా?

శ్లో॥ సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥ (18-66)

చింతింపకుము, సమస్త ధర్మములను విడిచి నన్నొక్కని శరణు పొందుము. నేను నిన్ను సమస్త పాపములనుండి విముక్తుని చేసెదను. ఊరక కూర్చున్ననూ యింద్రియములు యేదో కర్మనాచరించుచునే యుండును. అట్టి కర్మల వలన తెలియని పాపము లనుభవించవలసి యుండును. పాపకర్మలు దుఃఖబంధనము, పుణ్యకర్మలు సుఖబంధనము

యేదైన బంధనమే; కావుననే ప్రేమస్వరూపుడైన భగవంతుడు సమస్త ధర్మములు విడిచి తన్ను శరణుపొందమని తెలిపియున్నాడు. బంగారమందు మిశ్రమైన రాగిని బంగారముగా విక్రయించునట్లు సత్కర్మలాచరించి సర్వ కర్మలూ పరిత్యజించవలెను. "మామేకం శరణం వ్రజ" నన్నొకని శరణు పొందుము; అనగా భగవద్ధ్యానపరుడవు కమ్ము. భగవద్ధ్యానము కూడ సత్కర్మమే; అంతియేగాని కర్మత్యాగముచే ముక్తి లభించునని, పాపకర్మ లాచరించి పరిత్యజించిన వారికి భయములేదని తలంచవలదు. అట్టి వారికి గవర్నమెంటు వారి ట్రెజరీలో దొంగనోట్లు మార్చెడి వారి గతి తప్పదని మరువకుందురుగాక!

ఓమ్ తత్ సత్.



## రచయితలకు అభ్యర్థన

ఎప్పటివలె జూలై నెలలో గీతావాణి కవితా సంచిక వెలువరింప నిశ్చయించితిమి. కావున కవులు తమ పద్యరచనలను, గేయరచనలను జూన్ 25-వ తేదీలోపల మాకు చేరునట్లు పంప గోరుచున్నాము.

ఆళ్ళగడ్డ పోస్టు,
కర్నూలుజిల్లా.

సంపాదకుడు,
గీతావాణి ఆఫీసు.





ఓమ్.

# పుణ్యకర్మ ప్రభావము.

శ్రీ చిన్న రామదాసు.
శ్రీ పెద్దాశ్రమము, తాడేపల్లి. కొడాలిపోష్టు, కృష్ణాజిల్లా.

పుణ్యకర్మములు జీవితముపవిత్రమగుటకు కారణములగును. జీవితపవిత్రతయన హృదయము శుద్ధమగుటయే. హృదయశుద్ధియనగా కామక్రోధాది గుణములు లేకుండుట యగును. సుఖముపై ప్రీతిచే కామమున్ను, దుఃఖముపై ద్వేషముచే క్రోధమున్ను గల్గును. దేహాభిమానముచేతనే సుఖమునందు ప్రీతియు, దుఃఖమునందు ద్వేషమున్ను గలుగుచున్నవి. పరమాత్మయందు నమ్మిక లేకపోవుటచేతనే దేహాభిమానము కలుగుచున్నది. ప్రపంచ విషయములపై గల సుఖబుద్ధియే దేహాభిమానమును విడువనీయక జేయుచున్నవి. ప్రపంచమనిత్యమైనది, పరమాత్మయే సత్యమైనది, యను విషయమును అనుభవ పూర్వకముగా తెలిసికొనకపోవుటచేతనే దేహాభిమానమను పాశమునుండి విడివడజాలకున్నారు.

శ్లో॥ యజ్ఞదానతపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్ ।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్॥ భగవద్గీత.

తా॥ యజ్ఞదాన తపో రూపములైన పుణ్యకర్మలు ఫలాభిలాషలేని వివేకులకు హృదయ శుద్ధిని గలుగజేయును. గాన వాటిని విడువక చేయవలెనని భగవంతుడే సెలవిచ్చెను.

శ్లో॥ యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్॥
తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః॥

అ. 7 శ్లో॥ 28.

తా॥ మనస్సును శుద్ధము చేయునట్టి పుణ్యకర్మములను చేసి సకల పాపములను నశింపజేసికొనిన పుణ్యాత్ములు కోరికలు కోపములచేతను గలిగిన అవివేకమునుండి విడివడినవారై నిశ్చలమైన నియమముతో భగవంతుని సేవించుచున్నారు.

ఈ శ్లోకముకూడా పుణ్యకర్మలు చేసినవారికి మాత్రమే పాపములు నశించి భగవద్భక్తి గలుగునని చెప్పబడినది.

శ్లో॥ జన్మాంతరసహస్రేషు తపో దానసమాధిభిః ।
నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే॥

తా॥ అనేక జన్మలనుండి తపస్సు ధ్యానము సమాధుల నభ్యసించుటవలన నరులకు పాపములు నశించి శ్రీకృష్ణపరమాత్మయందు భక్తి గలుగును.

## గీతా వాణి.

శ్లో॥ క్రియాక్రమేణ మహతా తపసా నియమేన చ।
దానేన తీర్థయాత్రాభిశ్చిరకాలం వివేకతః ॥
దుష్కృతే క్షయమాపన్నే పరమార్థవిచారణే।
కాకతాళీయయోగేన బుద్ధిరంతః ప్రవర్తతే ॥ యోగవాసిష్ఠం

తా॥ యజ్ఞ దానాది పుణ్య కర్మలను గొప్పదగు తపస్సును చేయుటవలనను చిర కాలము తీర్థములను సేవించుటవలనను, నియమములను అవలంభించుటవలనను, ఇది నిత్య మైనది, ఇది అనిత్యమైనదనియు, ఇది మంచి, ఇది చెడుయనియును తెలిసికొను వివేక భాగ్యము గలుగును. పాపములున్ను నశించును. అప్రయత్నముగా పరమాత్మ చింతన యందు ఆసక్తి జనించును – చూచితిరా పుణ్యకర్మ ప్రభావము.

పుణ్య ప్రభావముచే భగవంతునిపై ప్రేమ గలిగిన వారి మనస్సు అప్రయత్నముగా తన్ను భగవంతునివైపునకే లాగుచు దైవప్రీతికరములైన పనులనే సర్వదా చేయించును. మీరాబాయి చెప్పెనని గాంధీమహాత్ముడు ఒక పద్యమును చెప్పెను.

ఆ॥ నాదు మెడకు నాది నారాయణుడు సన్న
ప్రేమతంతు వొండు వేసినాడు
దాని బూని యతడు తాలాగు కొలదిని
నహహా యతనిదాన నగుచునుంటి.

భగవంతునకు ప్రీతికరమైన పనులే పుణ్య కర్మములనబడును. అట్టి పుణ్యకర్మములే భగవత్కృప గలుగుటకు కారణములగును. భగవత్కృపను సంపాదించుకొనినవారినే భగవంతుడు తనయందు జేర్చుకొనుటకు పలువిధములచేత తన వైపునకు లాగుకొనును. ఇంతకన్నను పరమభాగ్య మింకేమి కావలెను?

అన్నవస్త్రములకన్నను సుకృతములే మన కెక్కువయని గాంధీమహాత్ముడు కూడా చెప్పెను.

పుణ్యము లేనివారికి అహింసా సత్యాస్తేయాది సద్గుణము లలవడజాలవు. వాటిని సంపాదించుకొనవలెనని పట్టుబట్టినను లభ్యపడవు.

పుణ్య ప్రభావముచేతనే విషయములపై వైరాగ్యము జనించి భగవంతునిపై చిత్తము నిలుచును. పుణ్యమువలననే బ్రహ్మనిష్ఠకు అనుకూలమైన స్థల, ఆసన, అన్న వస్త్రాది వసతులు యేర్పడును. శాస్త్రధర్మములను సద్గురువుల దివ్యోపదేశములను జ్ఞప్తిలో నుండులాగునచేసి ఆచరణలో నుంచుటకు తగిన వివేకబల మొసంగునది సుకృతమే యగును. సుఖదుఃఖములకు స్తుతినిందలకును, లాభనష్టములకును చలింపనీయక దైవమునందే దృష్టిని కేంద్రీకరింపజేయునది పుణ్యబలమేయగును.

సంకుచిత భావములను నశింపజేసి విశాలభావములను పెంపొందింపజేసి ఆత్మ సుఖమును జనులచే కీర్తిని వృద్ధిపరచునది పుణ్య ప్రభావమేయగును. వెయ్యేల తత్త్వ జ్ఞానము గలుగుటకు తగిన అనుష్ఠాన నిష్ఠలను చేయవలెనన్న సుకృత బలములేనిదే ఎవ్వరి కిన్ని సాధ్యపడదు.

పుణ్యమన్నను, ధర్మమన్నను, భక్తియన్నను, వివేకజ్ఞానమన్నను ఒకటే యగును.

శ్లో॥ సర్వపాపేషు నష్టేషు బుద్ధిర్భవతి నిర్మలా।
సైవ బుద్ధిస్సమాఖ్యాతా జ్ఞానశబ్దేన సూరిభిః॥ నారదపురాణం.

తా॥ హృదయములో గల సమస్తపాపములున్ను నశించినప్పుడే బుద్ధి శుద్ధమగును. శుద్ధమైన ఆ బుద్ధినే జ్ఞానమని తత్త్వజ్ఞానులు చెప్పిరి.

శ్రీ చిన్న రామదాసు.

# గ్రంథ స్వీకారము.

1. అధ్యాత్మగీతికః— వెల 0—2—0

ప్రకాశకులు:- స్వామి బ్రహ్మానందసరస్వతి, పెద్దగోపురము, పాలకొల్లు పోస్టు, పశ్చిమ గోదావరిజిల్లా.

2. రవీంద్రహృదయముః— వెల 0—6—0

గ్రంథకర్త:- పి. సుబ్బరామయ్యగారు B.A., B.L., వెంకటగిరి టౌన్, (నెల్లూరుజిల్లా)

రచయిత ఆంధ్ర వచన రచనలో వాసిగన్నవారు. ప్రామాణిక రచయితలు. ఆధ్యాత్మిక రసికులు. విశ్వకవి రవీంద్రుని బాహ్యజీవితాన్నిగాక అంతర్జీవితాన్ని సరసంగా-సంక్షేపంగా-సమగ్రంగా యీ చిన్నిగ్రంథంలో నిరూపించినారు. గ్రంథాన్ని అరగుక్కలో చదివాను. ఇందులోని ఉద్ధరణలు యెంతో విలువైనవి. మచ్చుకొక్కటి.

"యథార్థ సత్యమేమనగా - దేవుని రెండుపాళ్లుగ చేసిన మనము బ్రతుకజాలము. లోపల బయట దేవునితో మనము సంబద్ధులమై యుండవలెను. ఏ అంశములోనైనను ఆయనను మనము నిరాకరించినచో మనను మనము ఆత్మవంచన చేసికొని నష్టపడెదము. బ్రహ్మ నన్ను వదలలేదు. నేను బ్రహ్మను వదలకుందునుగాక!

(మాహంబ్రహ్మ నిరాకుర్యాం మామాబ్రహ్మ నిరాకరోత్")

# సద్గురువుల పాదసన్నిధియందు సమర్పింపబడిన

# సన్నుతి ప్రసూనములు.

సరల సుందర గంభీర సహజములగు
తేటమాటల బ్రతులకు మూటవిప్పి
దివ్యశక్తుల క్రీడించు దేవదేవు
జూపి మముబోంట్ల వెతలను బాపుచున్న
స్వామి శ్రీ శంకరానందు శాంతమూర్తి
స్వామి శ్రీ రామకృష్ణునే సన్నుతింతు. ౧

జీవదేవుల సంవాద భావములను
సాక్షిభావంపు దృష్టిసాక్షాత్కరింప
జేసుకొని గీతసాకుగా జేసుకొంచు
తెరిపిలేకుండ ఊరూర తిరిగి తిరిగి
భక్తకోటికి ప్రేమతో పంచుచున్న
స్వామి శ్రీ శంకరానందు శాంతమూర్తి
స్వామి శ్రీ రామకృష్ణు నే సన్నుతింతు. ౨

గీత కేవల వేదాంతి కేయటంచు
కొందరందరు కాని ఆ గురువు నాడు
బోధజేసిన మీగీత భువిసి నరుడు
పడయవలసిన మిహాపర భవ్యదివ్య
ప్రాభవోపేత జీవన గ్రంధమనుచు
తాముబడసిన అనుభూతి తనివితీర
తత్వజిజ్ఞాసులకు తెలుపు ధర్మరసికు
స్వామి శ్రీ శంకరానందు శాంతమూర్తి
స్వామి శ్రీ రామకృష్ణు నే సన్నుతింతు. 3

నేడు సర్వోదయానికి నిచ్చెనవలె
నున్న గీతార్థసారము సన్నుతమగు
సామ్యవేదము మనకుండ సామ్యవాద

మెందుకో తమ్ముడా వినుమిప్పుడైన
అంచు బోధించుచున్నట్టి ఆత్మవంతు
స్వామి శ్రీ శంకరానందు శాంతమూర్తి
స్వామి శ్రీ రామకృష్ణు నే సన్నుతింతు. ౮

జయతు జయతు గీతావాణి సర్వాంతరంగే
జయతు జయతు పాణిః దేవ సేవానురక్తః
జయతు జయతు దివ్యో విశ్వ కౌటుంబభావః
జగతి విషమ భావోన్మత్త రాత్రిఃప్రయాతు

## వా ర లు.

శ్రీ శ్రీ శ్రీ శంకరానందస్వాములవారు 6-5-55 నుండి 11-5-55 వరకు పాలూరు గ్రామమునందుండినారు. అక్కడ శ్రీ శంకరానందాశ్రమమునకు అంగభూతముగ అచ్చట శ్రీ రామానందాశ్రమము అను ఆశ్రమమును నూతనముగ నెలకొల్పిరి. ఆ ఆశ్రమమునకు శ్రీ పెద్ది నారాయణరెడ్డిగారు తాము యీవరకె కట్టివుంచిన ఒక కట్టడమును ఉచితముగ నొసగిరి. ఆశ్రమ పోషణకై రెండున్నర ఎకరముల భూమిని సహా దానమిచ్చినారు. స్వర్గస్థులగు శ్రీ ముమ్మడి కొండారెడ్డిగారు తమ అవసాన కాలమునందు దాన మొసగినభూమిని సైతము యీ ఆశ్రమ పోషణమునకై వినియోగించవలెనను తీర్మానము చేయుట యైనది. ఆ వారమురోజులు ఆ స్థానమునందు అనేకులగు శ్రోతల సమక్షమున వేదాంత కాలక్షేపము జరిగినది. పరమాత్మ దాతలకు పరమ శాంతిని ప్రసాదించు గాక!

శ్రీ శంకరానంద స్వామివారును శ్రీ రామకృష్ణానంద స్వామివారును 20-5-55 తేదీ మధ్యాహ్నమునకు పశ్చిమ గోదావరి జిల్లా పాలకొల్లు గ్రామము చేరిరి. ప్రసిద్ధమైన శ్రీ క్షీరరామేశ్వరాలయమునందు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారు శ్రీ సి. రాజగోపాలరాజాగారి పర్యవేక్షణతో ఆనాటి సాయంకాలమునుండి గీతోపన్యాస కార్యక్రమము ప్రారంభమైనది. జూన్ 4 వ తేదీవరకు అచ్చటవుండి అటనుండి తెనాలి తాలూకా దోనేపూడి గ్రామమునకు శ్రీ శ్రీ స్వామివారలు చేరుకొన్నారు. ఆ గ్రామము నందలి శ్రీ కృష్ణాశ్రమాధ్యక్షులగు సాధురామయ్యగారి ఆధ్వర్యముతో 6 వ తేదీనుండి గీతాసప్తాహము జరిగినది.

అచ్చటినుండి శ్రీ శంకరానందస్వామివారు హానొన్పేట వెళ్లినారు. శ్రీ రామకృష్ణగారు శరీరముయొక్క అస్వస్థతతో విశ్రాంతికొరకు స్థలాంతర మరిగినారు.

జూన్ నెల ముప్పదియవ తేదీ - ఆషాఢ శుద్ధ ఏకాదశినుండి మూడురోజులు తాడిపత్రి తాలూకా తిమ్మంపల్లె గ్రామమునందు శ్రీ నాగయ్యస్వాములవారు ఏర్పరచిన కార్యక్రమమునందు శ్రీ రామకృష్ణానందస్వాములవారు పాల్గొందురు.

జూన్ నెల 30 వ తేదీనుండి పదిరోజులు నంద్యాలలో శ్రీ శంకరానంద స్వాములవారి ఉపన్యాస కార్యక్రమము జరుగగలదు.

# గీతావాణి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

కర్నూల్ జిల్లా: 1. శ్రీ శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర పంచమ శ్రీ జగద్గురు వాగీశ పండితారాధ్య శ్రీ శివాచార్య మహాస్వాములవారు, — 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీ సీతారామాశ్రమం, గుళ్లదూర్తి, — 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డి ఎం.ఎల్.ఏ. గారు, నాగిరెడ్డిపల్లె,—4. స్వర్గీయ సేసు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీలక్ష్మమ్మగారు, నంద్యాల.— 5. శ్రీవంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, — 6. శ్రీపగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, — 7. శ్రీతొమ్మండ్ర రామసుబ్బయ్య శ్రేష్ఠిగారు, చాగలమర్రి. — 8. శ్రీఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, ఎం. కృష్ణాపురము. — 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. — 10. స్వర్గీయ శ్రీ జి. వీరారెడ్డిగారు, వి.ఎం. ఎర్రగుడిదిన్నె, — 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల.— 12. శ్రీబొల్లుపల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల,

కడపజిల్లా: 13. శ్రీ హిమకుంతల ఈశ్వరనారాయణరావుగారు, రామిరెడ్డిపల్లె, — 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్.ఎస్. — 15. శ్రీపోతేపల్లె రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు.

అనంతపురం జిల్లా; 16. పూజ్యపాద శ్రీ చిద్గనానంద మహారులవారు, శ్రీ భవనాశి ఆశ్రమం. — 17. శ్రీ పోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు. — 18. శ్రీ పి. నరసింహాశాస్త్రిగారు, కల్యాణదుర్గం.

చిత్తూరు జిల్లా: 19. శ్రీ మదళ్ళపల్లి మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, చిత్తూరు. — 20. శ్రీ యస్. రామలింగంపిళ్లెగారు, చిత్తూరు.

నెల్లూరుజిల్లా: 21. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, నెల్లూరు. — 22. శ్రీ వేమారెడ్డి బలరామరెడ్డిగారి ధర్మపత్ని యశోదమ్మగారు, ఇనమడుగు.

గుంటూరు జిల్లా: 23. శ్రీ శ్రద్ధానందస్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, (తెనాలి)

కృష్ణాజిల్లా: 24. శ్రీధూర్జటి సుబ్రహ్మణ్యంగారు, బందరు. — 25. శ్రీ భట్టిప్రోలు సత్యనారాయణరావుగారు, సర్కిల్ పేట, బందరు. — 26 స్వర్గీయ బావినేని నవరత్నం స్మారకముగ తలిదండ్రులు బావినేని రామకోటయ్యచౌదరి — రాజేశ్వరమ్మగారు, శ్రీ పరమాత్మానందాశ్రమము, శ్రీగీతాభవనము, పెనమలూరు.

తూర్పుగోదావరి జిల్లా: 27. శ్రీ సమయమంతుల నాగేశ్వరరావుగారు, ర్యాలి. — 28. శ్రీ సమయమంతుల ప్రకాశంగారు — సుబ్బమ్మగారి స్మారకముగ కుమారుడు శ్రీ నాగేశ్వరరావుగారు, ర్యాలి — 29. స్వర్గీయ సమయమంతుల మాణిక్యమ్మ కుమారుడు రామకృష్ణగారి స్మారకముగ తండ్రి శ్రీ నాగేశ్వరరావుగారు, ర్యాలి. — 30. శ్రీమాతం శెట్టి వెంకటరత్నం — శేషమ్మగార్ల స్మరణార్థం కుమారుడు జగ్గారావుగారు ర్యాలి. — 31. శ్రీ సమయమంతుల సత్యనారాయణ — వెంకటసుబ్బమ్మగార్ల స్మారకముగ శ్రీ నాగేశ్వరరావుగారు, రాధాకృష్ణరావుగారు, ర్యాలి.

పశ్చిమ గోదావరి జిల్లా: 32. స్వర్గీయ శ్రీ రాజులపాటి సుబ్బారాయుడుగారి స్మరణార్థము కుమారుడు శ్రీ వేంకటేశ్వరులు గారు, పాలకొల్లు. – 33. స్వర్గీయ శ్రీమతి అద్దేపల్లి శేషరత్నమ్మ గారి స్మారకముగ భర్త శ్రీ సత్యనారాయణమూర్తి ఎం. ఎల్. ఏ. గారు, పాలకొల్లు.

నైజాం స్టేట్: 34. శ్రీ డి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. – 35. శ్రీ పడిశాల భద్రయ్యగారు, వరంగల్ – 36. శ్రీ సాధు పాపయ్యగారు, బ్రహ్మవిద్యాశ్రమం, కేశవపట్నం, కరీంనగర్ జిల్లా.

మైసూరు స్టేట్: 37. శ్రీ పెండుకూరి గోవిందప్ప అండ్ సన్స్, హాస్పేట్ – 38. శ్రీ పత్తికొండ సుబ్రహ్మణ్యప్ప శ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మ గారు, హాస్పేట – 39. శ్రీ గంగావతి భీమప్ప శ్రేష్ఠిగారు, నారాయణదేవరకెరె. – 40. శ్రీ ఎం. వి. రామలింగయ్య శ్రేష్ఠిగారు, బంగారుపేట, – 41. శ్రీ జి. ఎన్. శంకర నారాయణ బ్రదర్స్, బెంగుళూరు సిటి.

మద్రాస్ రాష్ట్రం: 42. శ్రీ ఆర్. పి. రామనాథంరెడ్డిగారు, కాటుకానల్లూరు, – 43. శ్రీ గంథే నరసయ్య శ్రేష్ఠిగారు, నెం. 15 అణ్ణాపిళ్లెవీధి, మద్రాసు.

## రాజపోషకులు రు. 54

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీ బృందాదేవిగారి స్మారకముగ శ్రీ N. అయ్యపు రాజుగారు, గోనపాడు. – 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. – 3. శ్రీ చాటకొండు ఓబులేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. – 4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. – 5. శ్రీ సోముల పెద్దసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. 6. శ్రీ బైసాని రామదాసు గారు, ఆళ్లగడ్డ. – 7. డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్ళగడ్డ. – 8. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె. – 9. శ్రీ N. రామిరెడ్డిగారు, డబ్ల్యు. కొత్తపల్లె. – 10. శ్రీ మదర్లపల్లె రామసుబ్బయ్యగారు, చాగలమర్రి. – 11. శ్రీ జూటూరు చెంచుసుబ్బయ్య శ్రేష్ఠి & గరుడయ్య శ్రేష్ఠి గారలు, చాగలమర్రి. – 12. శ్రీమతి ఆర్. సుబ్బరత్నమ్మ గారు, నంద్యాల. – 13. శ్రీ పాణ్యాం రామచంద్రయ్యగారు, నంద్యాల. – 14. శ్రీ పాణ్యాం రామనాథశాస్త్రిగారు, కోయిలకుంట్ల. – 15. శ్రీ టి. సుబ్బయ్యగారు, పాణ్యాం. – 16. శ్రీ శాగం చిన్నకొండారెడ్డిగారు, పేరూరు – 17 శ్రీ జి. సి. బాలన్నగారు, ఆళ్లగడ్డ. – 18. శ్రీ యం. చిన్న ఈశ్వరరెడ్డిగారు, ఐలూరు. 19. శ్రీ కృష్ణం గురవయ్య శ్రేష్ఠిగారు, మర్చంట్, చాగలమర్రి. – 20. ధర్మపత్ని శ్రీమతి రత్నమ్మగారి స్మరణార్థం భర్త మాఖం సుబ్రమణ్యంగారు, నంద్యాల.

కడప జిల్లా: 21. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు. – 22. శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దటూరు. – 23. శ్రీ మిట్టా నారాయణ శ్రేష్ఠిగారు, పెద్దజూటూరు. – 24. శ్రీ పెంటంశెట్టి శ్రీనివాస శ్రేష్ఠిగారు

వేంపల్లి. — 25. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్య శ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. — 26. శ్రీ ముమ్మడి పెద్ద సుబ్బారెడ్డిగారు, పాలూరు.

అనంతపురం జిల్లా: 27. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి. — 28 శ్రీ బుస్సెట్టి వన్నప్పగారు, ఉరవకొండ. — 29. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు, రాగలపాడు. — 30. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. — 31. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి, — 32. శ్రీ పటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 33. శ్రీ కందుకూరు వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 34. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి. — 35. శ్రీ పెద్దకదిరప్పగారు, కుందనగుర్తి. — 36. శ్రీ చిన్నకదిరప్పగారు, కుందనగుర్తి. — 37. శ్రీ సాధు శివలింగప్పగారు, కుందనగుర్తి. — 38. శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి — 39. శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 40. శ్రీ శాకల ఆంజనేయులుగారు, కుందనగుర్తి. — 41. శ్రీపాటిల్ పెద్దబళిరెడ్డిగారిభార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి.—42. శ్రీమ్యాడం అశ్వత్థప్పగారు, కల్యాణదుర్గం. — 43. శ్రీ కానుల శరభయ్యశ్రేష్ఠిగారు, కల్యాణదుర్గం. — 44. శ్రీ బెల్లంకొండ రామప్పగారి వెంకటరమణప్ప కుమారుడు తిమ్మప్పశ్రేష్ఠిగారు, కల్యాణదుర్గం. — 45. శ్రీ గాధంశెట్టి లక్ష్మక్క కుమారుడు సుబ్బరాయుడుగారు, కల్యాణదుర్గం.

చిత్తూరు జిల్లా: 46. శ్రీ కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. — 47. శ్రీ బల్లా తెప్పులనాయుడుగారు, ముత్తరపల్లె. — 48. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం. ఎల్. ఏ., పెరియంబాడి. 49. శ్రీ నటకల రామనాథంశ్రేష్ఠిగారు, చిత్తూరు.

నెల్లూరు జిల్లా: 50. బ్రహ్మచారి శ్రీబి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము కనుపర్తిపాడు. — 51. శ్రీ జూపల్లి సూర్యప్రకాశరావుగారు, జూపల్లివారి నగరి, వెంకటగిరిటౌన్.

కృష్ణా జిల్లా: 52. ముక్కామల సీతయ్యగారి జ్ఞాపకార్థము ధర్మపత్ని శ్రీమతి నాగరత్నమ్మగారు, ఈడుపుగల్లు. — 53. శ్రీ ఆదూరి చలపతిరావుగారు. బందరు. 54. శ్రీ మోటుమర్రి దయానిధిగారు, బందరు.

తూర్పుగోదావరి జిల్లా: 55. శ్రీసమయమంతుల పెద్దనాగేశ్వరరావుగారు, ర్యాలి. 56. శ్రీ సమయమంతుల జగ్గారావు & బ్రదర్స్, ర్యాలి. — 57. శ్రీ సమయమంతుల రాధాకృష్ణరావు & బ్రదర్స్, ర్యాలి. — 58. శ్రీ మాతంశెట్టి జగ్గారావుగారు, ర్యాలి. 59. శ్రీ మాతంశెట్టి నాగరాజరావుగారు, ర్యాలి.— 60 శ్రీసమయమంతుల వెంకటరత్నం నాగమ్మగార్ల & రామన్న మాణిక్యాంబగారి స్మారకముగ శ్రీ వెంకటసుబ్బారావుగారు, ర్యాలి — 61 శ్రీ సమయమంతుల జగన్న కుమారులు జగ్గారావు, బుచ్చిరాజు, వెంకటరత్నంగారు, ర్యాలి. — 62. శ్రీ మానేపల్లి వీరభద్రరావుగారు, ర్యాలి.

## గీతావాణి – పోషకవర్గము

పశ్చిమగోదావరి జిల్లా: 63. శ్రీ అబోతుల రామన్న గారు, పాలకొల్లు. – 64. శ్రీ మామిడి సత్యనారాయణ గారు,పాలకొల్లు. 66. –రుద్రరాజు బచ్చాయ్యమ్మ గారు,పోడూరు.

నైజాం స్టేట్: 67. శ్రీ పి. వి. రంగారావుగారు, నల్గొండ. – 65. శ్రీదేశముఖ్ వేనేపల్లి కొండలరావు గారు, నల్గొండ. – 68. శ్రీ నాగబండి విశ్వనాథంగారు, వరంగల్. – 69. శ్రీమతి చిదిరాల వీరలక్ష్మమ్మ గారు, శ్రీ నృసింహ భక్త మండలి,వరంగల్. – 70. శ్రీ గంటె రాజయ్యగారి లింగయ్య గారు, వరంగల్. – 71. శ్రీ తోటి కేదారిగారి చంద్రశేఖరంగారు, వరంగల్. – 72. శ్రీతాటికొండ నాగయ్య గారు, వరంగల్. – 73. శ్రీ పుల్లాది సూర్యనారాయణగారు, వరంగల్. – 74. శ్రీ మదూరు బసవలింగంగారు, వరంగల్. – 75. శ్రీ కొమరవెల్లి సూరయ్య గారు, వరంగల్. – 76. శ్రీయాదా నారాయణగారు, వరంగల్. – 77. శ్రీ గునిశెట్టి నాగలింగంగారు, వరంగల్. – 78. శ్రీ తోటి జగన్నాధంగారి ముక్తేశ్వర్ గారు, వరంగల్. – 79. శ్రీగన్ను బుచ్చయ్య గారు, వరంగల్. – 80. శ్రీమతి కామేశ్వరమ్మ గారు c/o రవ్వా కైలాసంగారు, వరంగల్. – 81. శ్రీ సోమా నరసయ్య గారు, వరంగల్ – 82. శ్రీ వజినపెల్లి నరసయ్య గారు, వరంగల్ – 83. శ్రీ చండా పుల్లయ్య గారు, వరంగల్ – 84. శ్రీ చిదిరాల రాజశేఖరం గారు, వరంగల్ – 85. శ్రీ చెలుపూరు మంకయ్య గారు, వరంగల్.

మైసూర్ రాష్ట్రం: 86. శ్రీకాకుబాళ అంబణ్ణశ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హాస్పేట్ 87. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠిగారు, బంగారుపేట. – 88. శ్రీ కె. ఆర్. సీతారామయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట. – 89. శ్రీ కె. నంజప్పశ్రేష్ఠిగారు, బంగారుపేట. – 90. శ్రీ నారాయణమూర్తిగారు, c/o సూరా విరూపాక్షయ్య గారు, తొండేభావి. – 91. శ్రీ కె. చౌడయ్యగారు, జమీందార్, మిణకనగుర్కి. – 92. శ్రీమతి కుసుమ భాగ్యలక్ష్మమ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్.

మద్రాసు రాష్ట్రం: 93. శ్రీ శంకరనాయుడుగారు, కార్వేటినగరు, నార్వారాడు జిల్లా. – 94. శ్రీ సి. ఎస్. నాగరాజశ్రేష్ఠిగారు, కొళ్లేగాలం, కోయంబత్తూరుజిల్లా.

## అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు–16.
2. శ్రీ గజ్జల్లి నాగిరెడ్డిగారు, వండవాగళి, ఆలూరుతాలూకా. (కర్నూలు)
3. శ్రీమతి లంకా భాగీరథమ్మ గారు, పొన్నమ్మగుడివీధి, చిత్తూరు.
4. కోసూరి సూరాయమ్మ గారు, వెదిరేశ్వరం, తూర్పు గోదావరి.
5. శ్రీ చిలుకూరి వేంకటకృష్ణమూర్తిగారు, దేవగ్రామం, ఆచంట పోస్టు, ప. గో. జిల్లా.

---

Edited & Published by N. Shrikantam, Gulladurthy, Koilkuntla
Managing Editor: Swami Sri Ramakrishnananda, Vice-President
Sri Gita Sahitya Sevasamithi, Allagadda – Kurnool Andhra.

# భగవద్గీత మహిమ.

రచన:— కుమారి ఆర్. లక్ష్మీదేవమ్మ, చాగలమర్రి.

("విన్నారా జనులారా" అనువరుస)

విన్నారా జనులారా వీనులార శ్రీ గీతాకథా
శ్రీ భగవద్గీతా మహిమకథా ॥విన్నారా॥

మనసారవచ్చి శ్రీ కృష్ణమూర్తి
విశ్వరూపమును చూపెట్టిన
శ్రీ భగవద్గీతా మహిమకథా ॥విన్నారా॥

పదునెనిమిది యోగాలందూ
పదమేనికాని ముక్తిమార్గ బాటయని
వ్యాసమహర్షుల బోధకథా ॥విన్నారా॥

పరవిజయుడు రణరంగములో
చూసి చుట్టముల విలపోగా
ఘోరమైన యుద్ధములోనా
హేకృష్ణా హేదేవా
అని పార్థుడెంతో పలపించిపోయిన
కృష్ణార్జుల సంవాదకథా ॥విన్నారా॥

విన్నవిన్న చెవులూరు చుంపునే
వెన్నవోలె పాపాలు కరగునే
ఎన్నరాని స్వర్గసీమ బాటలై
ముక్తికేని సులువైన మార్గముని
వాసుదేవుని బోధకథా. ॥విన్నారా॥

ఓం శాంతిః శాంతిః శాంతిః.

ఓమ్

★

గీతావాణి కార్యాలయమువారు ప్రకటించిన క్రింది పుస్తకములను సరిగా ప్రచారము చేయుటకై ధారాళముగ కమీషన్ యిచ్చుటకు నిశ్చయింపబడినది. అసలు పుస్తకముల వెలలే తక్కువ. అయినను సాహిత్య ప్రచారదృష్టితో యీ ఏర్పాటు చేయబడినది. కొద్ది ఆర్డరులకుగాని, చిల్లర అమ్మకముగాని యీ కమీషన్ యివ్వబడదు. గ్రంథాలయ, పుస్తకవర్తకులు యీ సదవకాశమును చక్కగా వినియోగించుకొనగలరు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| గీతాతాత్పర్య ప్రదీపము | వెల | 1-8-0 | నూటికి | 15/- | కమీషన్ |
| భక్తియోగము | ,, | 1-0-0 | ,, | | |
| గీతామూలము | ,, | 0-8-0 | ,, | 12½/- | ,, |

ఇట్లు,

మేనేజరు,

శ్రీ గీతావాణి కార్యాలయము,

అవనిగడ్డ P.O. (కృష్ణాజిల్లా)

శ్రీ వేదవ్యాస ప్రెస్, [illegible], జూన్ 1955 ప్రతులు 1000.